





# శతకాలు

## భక్తి,జ్ఞాన,నీతి

# రాజయోగ శతకం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan | INSA | Times of India | Tamil Heritage Foundation |
| CMU-Books | | Indian Express | AnnaUniversity NEW! |
| Sanskrit | | The Hindu | |
| TTD,Tirupathi | | Deccan Herald | |
| Kerala Sahitya Akademi | | Eenadu | |
| | | Vaartha | |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

**స్వామి వివేకానంద**

“దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం” అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన ‘ఇచ్ఛ’ (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. “నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది” అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



శ్రీ ర స్తు.

శ్రీరామచంద్రగురుపరబ్రహ్మణేనమః.

# శ్రీ రాజయోగి శతకము.

---

తే. గీ. శ్రీకరంబగు విజ్ఞాన సిద్ధికొఱకు
సద్గురుస్వామి చరణాంబుజములుదలఁచి
హరిహర హిరణ్యగర్భుల కాత్మమొక్క-
రమ్యముగఁ దెల్పెద వినుము రాజయోగి. 1

తే. గీ. గురుఁడె శ్రీహరి రుద్రుండు గురుఁడె బ్రహ్మ
గురుఁడె పరమాత్మ ప్రణవంబు గురుఁడె గురుఁడు
గురునికన్నను పరతత్వ మరయ లేదు॥ రమ్యముగ॥ 2

తే. గీ హరిపదమును కైలాస పదముఁ గాంగ
సత్యలోకంబు వైకుంఠ సదనముఁ గ
గురుపదమువక్క- వేఱొండు పరము లేదు॥ రమ్యముగ॥ 3

తే. గీ. గురుని శ్రీపాద తీర్థంబు గ్రోలఁబడును
గురువరుని సుప్రసాదంబు గొన్న బరము
సద్గురు ధ్యాన్నమే ప్రొద్దు సలుపఁబడును॥ రమ్యముగ॥ 4

తే. గీ. పరమునొందుటకొక దివ్య పదవిగలదు
యమపురంబులేక శ్రీగురు చరణములను
మనసు కెప్పుడు గొల్వుఁడు మానితముగ॥ రమ్యముగ॥ 5

తే. గీ. గురువరుని మహిమ మరయుంగ దరముగాదు
హరిహర బ్రహ్మలకునైన వెరపుగల్గి
భక్తిచేఁగోరి సేవింప బరమొసంగు॥ రమ్యముగ॥ 6

తే గీ. గురుపదంబున కర్థంబు గోరివినుము
ప్రథమవర్ణంబు ప్రకృతిగా బరగుచుండు
దానిష్ఠ దర్ణ మజ్ఞాన ధ్వంసకారి॥ రమ్యముగ॥ 7

తే. గీ. అట్టిగురునకు సద్భక్తిఁ దనుదినంబు
శుభమతస్థానాంగ భావాత్మకము లనఁగ
నాల్గుశిక్షాప్రష లొనరింప గల్గు ముక్తి॥ రమ్య॥ 8

తే. గీ. గురుని సత్కృపలేకను గొప్పమైన
బరముదెలియంగ దరమౌనె బ్రహ్మకైన
సరసిసంపూర్ణ బోధజ్ఞ నహగవలయు॥ రమ్య॥ 9

తే. గీ. వేదవేదాంత శాస్త్రము లెన్నడకజూచి
జాడదెలియక శాస్త్ర వాసనయు దేహ
లోకవాసనలను జెడె లోకమెల్ల॥ రమ్య॥ 10

తే. గీ. దేహభ్రాంతులలో జిక్కి దేవతలను
నెంచుచుందురు మానవు లెవ్వులగుచు
దేహమంటనగల వాని దెలియలేక॥ రమ్య॥ 11

తే. గీ. తరుణులందము ముద్దుల తనయులందు
ధనములందును భ్రాంతిచే దగులుకొనిరి
యిట్టివారికి కైవల్య మెట్లుదొరకు॥ రమ్య॥ 12

తే. గీ. అరయకామంబు క్రోధంబులనెడి దుష్ట
సంగములుమాని సతతంబు సమరసైక్య
జ్ఞానయోగంబు బూనిన ఘనులుగారె॥ రమ్య॥ 13

తే. గీ. యూర్ములంబాసచే భ్రాంతు లుడుగలేక
ధనమదాంధులు గొలుతురు దవిలియెపుడు
కష్టజీవుల కెవ్విధిగల్గు బరము॥ రమ్య॥ 14

తే. గీ. కోటికొలఁ గ్రంథములనుగూర్చు జేటుకొఱకె
బూటకపు మాటలాడుట కూటికొఱకె
యెన్నివిద్యలు నేర్చిన మన్నకొఱకె॥ రమ్య॥ 15

తే. గీ. చదువులు గణింప వేరైన సారమొకటె
భావములు విభేదమొందిన భక్తియొకటె
తనువులిల వేరుగా నున్న తత్త్వమొకటె॥ రమ్య॥ 16

తే. గీ. క్షేత్రములటంచు నెన్నియో తిఱిగితిఱిగి
దైవములటంచు నెన్నియో దలఁచిదలఁచి
తుదకు వ్యర్థత్వమొందుట లిదినిజంబు॥ రమ్య॥ 17

తే. గీ. గంగయమునా సరస్వతీ సంగమమున
వరహిరణ్మయ కోశాంత వర్తులైన
వారికేలను తీర్థదైవముల భ్రాంతి॥ రమ్య॥ 18

తే. గీ. కన్నులందున సూక్ష్మాంగ మున్న తెఱవు
వన్నెచిన్నెలు గనుకున్న నెన్నదరమె
మున్ను గురువాక్య మెఱుఁగని పిన్నలకును॥ రమ్య॥ 19

తే. గీ. అండమెన్నంగ పిండమం దమరియుండు
పిండయండము మధ్యను బ్రణవముండు
ప్రణవమెఱిఁగినయతఁడె పో బ్రహ్మవిదుఁడు॥ రమ్య॥ 20

తే. గీ. పిండమెఱిఁగిన యోగి సద్విమలజీవి
అండమెఱిఁగిన యోగి సత్యముగశివుఁడు
అండపిండము లెఱిఁగిన యతఁడె బ్రహ్మ॥ రమ్య॥ 21

తే. గీ. కూటమెఱిఁగిన యోగికి కుదురుమనసు
మాటలెఱిఁగిన యోగికి మనసునిలదు
గూటమున నాదబిందులు గూడుచోటు॥ రమ్య॥ 22

తే. గీ. మనసుపవనము లేకమై యొనయసుఖము
మనసుగూర్చుట విజ్ఞానమహిమసుమ్ము
మనసుగూర్చిన మానవుల్ మహాసియురుదు॥ రమ్య॥ 23

తే. గీ. పవనమున సోహమనియెడి పథమెఱింగి
బిందువందున నైక్యంబు పొందుపఱచి
నాదబిందుల గల్గుటే నైపుణంబు॥ రమ్య॥ 24

తే. గీ. రేచకము పూరకంబుల రీతి దెలసి
కుంభకంబున గుదియించి గుఱుతెఱింగి
చూపులోచూపు జూచుటే సుఖకరంబు॥ రమ్య॥ 25

తే. గీ. పవనమభ్యాసమున నెట్లు పట్టుబడును
బద్ధమైయున్న మనసెట్లు శుద్ధమగును
మనసుపవనంబు గూర్చుటే మార్గమేది॥ రమ్య॥ 26

తే. గీ. చిత్తశోధన జేసిన ధన్యులకును
పంచ వింశకునెఱుగుటే ఫలముసుమ్ము
పంచ వింశాత్మకుండె పర బ్రహ్మమయ॥ రమ్య॥ 27

తే. గీ. సాత్త్వికున కాత్మశోధన చాలగల్గు
రాజసునకాత్మ విజ్ఞాన రత్నమబ్బు
దా తమోగుణుండాత్మవిద్య గనలేడు॥ రమ్య॥ 28

తే. గీ. శిక్షలేకను మానవుల్ చెడిరి భువిని
దీక్షగల్గిన గోప్యంబు దెలియవచ్చు
గోప్య మెఱుంగక తత్త్వంబు కుదురదెందు॥ రమ్య॥ 29

తే. గీ. పంచవింశతి తత్త్వంబు లెంచిమించి
సంచితాగామికర్మల ద్రుంచెనేని
లింగతనుభంగ మొందెటి సంగతిమహి॥ రమ్య॥ 30

తే. గీ. స్థూల సూక్ష్మాంగములమీఱి చోద్యముగను
కారణాంగంబు దాట నేకాంతముక్తి
ముక్తియనవేఱె దేశాన మొలచిరాదు॥ రమ్య॥ 31

తే. గీ. జీవగుణములు దలపోసి దేవునెరిగి
జీవ శివులనుగూర్చిన జెలగుముక్తి
జీవశివభేద మొనరించి చెడిరినరులు॥ రమ్య॥ 32

తే. గీ. అంగమందున్న లింగంబు నరయుగానె
లింగమందున పరమాత్మ లీలదెలియు
అంగలింగైక్యమేగదా యమృతపదవి॥ రమ్య॥ 33

తే. గీ. యెఱుకలకునెల్ల నెఱుకైన యెఱుకవీవు
మరుపులకునెల్ల మరుపైన మరుపవిద్య
యెఱుకలో మర్మమెఱిఁగిన పరమసుఖము॥ రమ్య॥ 34

తే. గీ. యెఱుకమనసుని దలఁతురు వెఱ్ఱులగుచు
యెఱుకద్విదళాబ్జమున నెఱ్ఱు లెఱుఁగ రవని
యెఱుకమనమైన పరమాత్మ నెఱుఁగుటెట్లు॥ రమ్య॥ 35

తే. గీ. మనసుశుద్ధియె సుజ్ఞానమనెడి మూర్ఖ
జనుల దుర్బోధలనువిని చెడెధరిత్రి
జ్ఞానమునగాక మనము శుద్ధానెదలప॥ రమ్య॥ 36

తే. గీ. ఘోరదావానలముచేతఁ గొట్టవచ్చు
మీరివారధికావల జేరవచ్చు
ధీరతమసంబు గుదియింప నేరరాదు॥ రమ్య॥ 37

తే. గీ. కాంతరూపంబు గనుఁగొన్న గలఁగుమనము
వింతగాదది పూర్వమం దీశ్వరునకు
మాయమోహిని గనుఁగొన్న మనముచెడదె॥ రమ్య॥ 38

తే. గీ. మగువల మమత్వమున మున్ను ముగురుచెడిరి
తగులుబడి మొదటికిజెడె జగములన్ని
కోరికలకెల్ల పుట్టిల్లు క్రూరమనము॥ రమ్య॥ 39

తే. గీ. అష్టమదములబుట్టించు భ్రష్టుఁజేయు
శ్రేష్ఠములనుపించు మరి దురాదృష్టుఁజేయు
నష్టకష్టంబులకు మన సాలయంబు॥ రమ్య॥

తే. గీ. మనసుతోఁగూడు జీవుల మనుజులండ్రు
బుద్ధితోఁగూడు జీవుల బుధులటండ్రు
చిత్ప్రభముగూడు జీవుల శివుఁడటండ్రు॥ రమ్య॥ 41

తే. గీ. మనసువిషయంబు లందుండి మరలెనేని
పరము నరచేతి యుసిరిక ఫలమనుమ్ము
మనసు జన్మస్థలంబున మరియునిజము॥ రమ్య॥ 42

తే. గీ. మనసునిర్మలమౌ జ్ఞాన మహిమచేత
మనసుజెడకున్న జ్ఞానంబు మహిని లేదు
జ్ఞానమనముల మర్మంబు బూనికనుము॥ రమ్య॥ 43

తే. గీ. బుద్ధిలేకను కొందఱు బుధులమనుచు
విఱ్ఱవీగుచు నుందురు వెఱ్ఱియేమొ
వెఱ్ఱిగాకాత్మవిద్యను వెదుకరాడె॥ రమ్య॥ 44

తే. గీ. మనసునిలుచుట సాధన మహిమకొంత
పూర్వఫలవాసనలఁ గొంత బోధఁగొంత
గాకఁ గురువాక్యము ననంతగదలదెపుడు॥ రమ్య॥ 45

తే. గీ. సాధనములేక తత్త్వార్థ సరణిఁదెలియ
బాధకమెగాని సన్మార్గ పథముగాదు
బోధతోనైన సాధన బొందవలయు॥ రమ్య॥ 46

తే. గీ. చూపులోసర్వ మొకటిగాఁ జూడఁవలయు
రూపనామాధిక భ్రాంతి రోయఁవలయు
పాపవృత్తుల మొదలంట బాపవలయు॥ రమ్య॥ 47

తే. గీ. నామపులోనున్న రూపముల్ సృష్టిగల్గు
రూపులోఁ భేద భావన రూఢిసుమ్ము
నామ రూపంబు లొకటిగాఁ జూడఁ సుఖము॥ రమ్య॥ 48

తే. గీ. అనుభవంబుగాఁ దోఁచి యాట పూర్ణమైనవాని,
ఘనమనంబున దెలియంగ గాదుగాని,
తన్ను దాఁ దెల్పెడుగు సూక్తి దలఁపవలయు॥ రమ్య॥ 49

తే. గీ. యెఱుకచేఁ గల్గు లోకము లెల్లజూడ
మఱుపుచే దోఁచకుండును మఱియు జగము
యెఱుక మఱుపుల లోనున్న దెఱుఁగవలయు॥ రమ్య॥ 50

తే. గీ. నామరూపులసంధున నాడునపు
యున్న పరిపూర్ణమును గనుచున్నవాని
కద్వయపదంబు గలదనుటది నిజమ్ము॥ రమ్య॥ 51

తే. గీ. గోత్రమును జాతియును లేక గుణము లేక
ప్రకృతికంటెను పరమైన బ్రహ్మపదము
నరయ వివరాని లోకుల కాశనాక॥ రమ్య॥ 52

తే. గీ. ఆశచే గొందరయ్యలు మోసపడిరి
దోసమెఱుఁగని యాశకు దోఁపలేము
ఆశ మొదలంట గోసిన యతఁడె ఘనుఁడు॥ రమ్య॥ 53

తే. గీ. బట్టబయలైన యా బ్రహ్మపదము దెలియ
సద్గురుస్వామి కృపయెగా సాధనంబు
యెన్ని చదువులు చదివిన నేమిఫలము॥ రమ్య॥ 54

తే. గీ. తత్త్వమస్యాదివాక్యముల్ దలఁచిచూచి
ప్రజ్ఞచే దెల్పవలెగాని పరమపదము
తర్కవాదుల కెందైన దరముగాదు॥ రమ్య॥ 55

తే. గీ. దృశ్యమగా వస్తువెల్లను నశ్యమౌను
అరయసాక్ష్యత్వమగా దృశ్యవిరహితంబు
వుభయదోషాపరోక్షమై యొప్పుపరము॥ రమ్య॥ 56

తే. గీ. తరుచుగాదాను దనలోన దఱచదఱచ
సురుచిరంబైన పరతత్వ మెఱుఁగవచ్చు
పాలుదరచియు, యమృతంబు బడయుకరణి॥ రమ్య॥ 57

తే. గీ. ప్రకృతిబ్రహ్మంబటంచును బల్కుచుందు
జ్ఞానహీనుల తలపేల జ్ఞానిజూచు
ప్రకృతిబ్రహ్మంబుగాభేద భావముడిగి॥ రమ్య॥ 58

తే. గీ. పాలలోఁబోయుజలమెల్ల పాలెయౌను
పాలుసీరౌనె యెన్నెన్ని పాట్లుబడిన
జ్ఞానియజ్ఞానిగా నెన్ని గతులనైన॥ రమ్య॥ 59

తే. గీ. స్వానుభవసిద్ధిగల్గిన యాత్మవేత్త
కోటికొక్కఁడుగల్గును కోరిచూడ
రాలయందుండి దోపని రత్నమట్లు॥ రమ్య॥ 60

తే. గీ. విశ్వమునదోచు యింద్రియ విషయవర్గ
మెల్లబ్రహ్మంబుగా దోచుటేదలంప
యోగసిద్ధికిమూలంబు యుర్విలోన॥ రమ్య॥ 61

తే. గీ. బాలకోన్మత్త పైశాచ భావుగతిని
దోచువిజితేంద్రి యజ్ఞానివేచ, వింద్రి
యాదిదోషంబు లాకేఁ డధ్యాత్ముఁడౌట॥ రమ్య॥ 62

తే. గీ. జ్ఞానులను పేరుగల్గిన ఘనులటంచు
చేరెలుదురు కొన్ని శాస్త్రార్థ జాలమెఱిఁగి
జ్ఞానమదియెట్లు యనుభవ జ్ఞానమగును॥ రమ్య॥ 63

తే. గీ. వేషభాషలు గల్గిన వేత్తయౌనె
వాసనత్రయుఁడా పరవాసుఁడౌనె
దోసమెఱుఁగని దొంగల కాశవిడునె॥ రమ్య॥ 64

తే. గీ. తత్త్వమెఱిఁగిన శిష్టుల దఱచిజూచి
పూని సేవించువారలే పూజ్యులఱయ
కులమునెంచగ పనిలేదు గుణమెముఖ్యము॥ రమ్య॥ 65

తే. గీ. తత్త్వవేత్తలపాదముల్ దలనుమోపి
వందనముసేయువారల వైభవంబు
బ్రహ్మపదమైన లేశమాత్రమ్మసుమ్మ॥ రమ్య॥ 66

తే. గీ. యోగములు కర్మగతిజేసి జోగులైరి
భోగములుకోసి కొందరు రోగులైరి
ఆగమార్థంబుదెలియని యధములెల్ల॥ రమ్య॥ 67

తే. గీ. నిత్యనైమిత్తికాదుల నెరపువారి
కాశయేగాని పరమార్థ మందలేరు
జలధరముగ్రమ్మ చీకటి దొలఁగిపోనె॥ రమ్య॥ 68

తే. గీ. చెలఁగి యజ్ఞాదిక్రతువులు జేయనేల
రాలపూజించి నేలపై వ్రాలనేల
సాధులనుగని సేవింప సార్థకంబు॥ రమ్య॥ 69

తే. గీ. శుద్ధమైయున్న తనకెట్లు శుద్ధిగల్గు
మురికిదేహముకేరీతి మోక్షమబ్బు
తీర్థయాత్రలకాసించి తిఱుగనేల॥ రమ్య 70

తే. గీ. విష్ణుపూజించి కొందఱు శ్రేష్ఠులైరి
శివునిపూజించి కొందఱు సిద్ధులైరి
అద్వయబ్రహ్మమెఱుఁగక యధములైరి॥ రమ్య॥ 71

తే. గీ. మతములను భ్రాంతిలోఁ జిక్కి మనుజులెల్ల
మోహసంసార వారిధి మునిఁగి చెడిరి
దైవమొక్కఁడని మతములు తమకునేల॥ 72

తే. గీ. హరిహరుల భేదమెంచెడి యల్పమతులు
ఘోరనరకార్ణవము కడఁజేరలేక
జన్మదుఃఖంబులను గని కర్ములైరి॥ రమ్య॥ 73

తే. గీ. పాపధర్మాది కర్మలు బూని చేయు
స్వర్గభోగంబుగల్గుచో సౌఖ్యమంద్రు
ఇహముకన్నను స్వర్గమందేమిగలదు॥ రమ్య॥ 74

తే. గీ. స్వర్గమందుఁ జిరభోగపదవిగనిన
ప్రకృతియందుండు స్వర్గంబు పాడుగాదె
పుణ్యముడిగిన మర్త్యత్వమును వహింత్రు॥ రమ్య॥ 75

తే. గీ. క్రూరులై హత్యలొనరించు ఘోరపాపు
లరయనీశుననిఁ గ్రహబద్ధులౌటనిజము
వారలెరసి కడతేరలేరనిమ్ము॥ రమ్య॥ 76

తే. గీ. పుణ్యపాపంబు లొనరించు పుడమిలోన
గర్భనరకాది దుఃఖముల్ గల్గుచుండు
పుణ్యపాపంబులంటక బోకలవలయు॥ రమ్య॥ 77

తే. గీ. ధరణిసురులందు గోవందు దంతియందు
శునకలందును శ్వపచాది క్రూరులందు
సమవర్తించువాఁడె బో సుమహితుండు॥ రమ్య॥ 78

తే. గీ. యెక్కడెక్కడఁ జూచిన నిక్క పరుల
శేఖరింపుము తెలియుము తిక్కనపులు
యెక్కడెవ్వరు పరమేష్టి సృష్టియందు॥ రమ్య॥ 79

తే. గీ. కాలమును బ్రార్థుచే తమకాలమెల్ల
నపహరింపఁగ దెలియక చపలులగుచు
లోకమరాశించి చెడె జనలోకమెల్ల॥ రమ్య॥ 80

తే. గీ. ప్రథమ ధర్మార్థకామముల్ పాలయఁజేసి
మోక్షమాసించనట్టి యీ మూర్ఖజనుల
కెట్లుదొరకును నిర్వాణ మెంచిచూడ॥ రమ్య॥ 81

తే. గీ. సర్వలోకంబులకు పరస్థానమేదొ?
అదియె సర్వంబులకు ధర్మమనిచూడ
ధర్మమోక్షంగ మునిజాలు ధరిసుయరుము॥ రమ్య॥ 82

తే. గీ. అర్థమేలాఁగని మానవుల్ వ్యర్థముగను
అర్థమనివేలు గడియింతు రదియుగాదు
అర్థమన సర్వమును సత్పదార్థమనుట॥ రమ్య॥ 83

తే. గీ. ఇట్టి ధర్మంబు నర్థంబు నెఱుఁగనోరు
నట్టిసంకల్పమే కామమనఁగ బరగు
కామమన, విషయేచ్ఛలు గావుసుమ్ము॥ రమ్య॥ 84

తే. గీ. సర్వమును బ్రహ్మమని శృతుల్ జాటుచుండ
దెలిసిమఱిపెడే హేతువు తెలియలేరు
పరముపై యాశచే యిహ పాటుబడుచు॥ రమ్య॥ 85

తే. గీ. ఇహముపై నాశయును పెనుగ్రహముసోక
కామమోహాది వృత్తులు గ్రమ్ముచుండు
గావున జగద్వేషంబు గలుఁగవలయు॥ రమ్య॥ 86

తే. గీ. తల్లిదండ్రులు నన్నలు దమ్ములాప్త
బంధువులు భార్యసుత హితు లెందరైన
దేహమును వేళతో జనుదెంచరవని॥ రమ్య॥ 87

తే. గీ. బాల్యయవ్వన కౌమార వార్ధకముల
కాలములుగూడ నూరేండ్లు గనువటంచు
వ్యర్థముగ కాలవ్యాసన పలదువలదు॥ రమ్య॥ 88

తే. గీ. ఇప్పుడో లేక యెప్పుడో ముప్పునొందు
తప్పఁబోదిది జీవ్రంము చెప్పకేగు
తెప్పునను సత్పదార్థంబు దెలియవలయు॥ రమ్య॥ 89

తే. గీ. ధనము యెంతెంతయున్నను దగిలిరాదు
యేనుఁగలు గుఱ్ఱములు వెంట నేగుదెంచ
వక్కటా ధర్మమొక్కటే దిక్కుదెలియ॥ రమ్య॥ 90

తే. గీ. తనుమనంబులు గురునకు ధారబోసి
ధనము సత్పాత్రహిత పరత్వముగ జేసి
దేశమును కాలపాత్రము దెలియవలయు॥ రమ్య॥ 91

తే. గీ. పెద్దలనుగని సేవింప పిరుడియకుము
పెద్దలాచరణీయము పేర్మిగనుము
పెద్దలతో వాదభేదము లొద్దుసుమ్ము॥ రమ్య॥ 92

తే. గీ. ధర్మ దెలియని కర్మలు దవిలిసేయ
దుర్మదము హెచ్చి విశ్రాంతి దొఱకదెపుడు
ధర్మమెఱిఁగి నటింప సుకర్మసుమ్ము॥ రమ్య॥ 93

తే. గీ. రాజయోగంబు పరమంద రాజపథము
యనుభవజ్ఞాని దొరుకుట యరుదుసుమ్ము
దొరికెనేనియు దెలుపరు దుర్మదులకు॥ రమ్య॥ 94

తే. గీ. మందబుద్ధులు సంసార మగ్నులగుచు
సుందరంబగు యోగంబు జెందుటకును
పాలుమాలికచే ఫలభ్రష్టులైరి॥ రమ్య॥ 95

తే. గీ. పొట్టకై మానవుల్ పెక్కుకష్టములను
బడుచు నిర్మలమగుజ్ఞాన పథముఁజేరరు
పొట్టనింపుట ఘనమాయె పుడమిలోన॥ రమ్య॥ 96

తే. గీ. మృగములును జలచరములు ఖగకులంబు
లెవ్విధంబగు జీవనం బెసఁగి బ్రతుకు
సృష్టితో జీవనము బ్రహ్మ యేర్పరించె॥ రమ్య॥ 97

తే. గీ. మనుజుఁడొనర్చిన యాకర్మమును దొలఁగదు
చేయనిఫలఁబుఁగోరిన జెందబోదు
కర్మఫలమునుఁబొందక గాదుపుడమి॥ రమ్య॥ 98

తే. గీ. కర్మయే దేవభావన గల్గుటకును
కర్మయే హీనజన్మకు కారణంబు
కర్మలేకున్న జన్మంబు గలుగఁబోదు॥ రమ్య॥ 99

తే. గీ. పంచభౌతికమగు జగమెంచిచూడ
సంచితాగామికర్మల సారమేను
మధ్యనున్నట్టి ప్రారబ్ధ మనుభవంబు॥ రమ్య॥ 100

తే. గీ. జీవకరుణా పరత్వంబు జెందుటొకటి
భావమున దేహవిభ్రాంతి బాయుటొకటి
యింతకన్నను మోక్షోక్తి యెందులేదు॥ రమ్య॥ 101

తే. గీ. దేహధారులకెల్లను దేవుఁడొకఁడు
వేరుగాజూచి భ్రమజెంద వెఱ్ఱితనము
సందియంబెడబాసిన సర్వమతఁడే॥ రమ్య॥ 102

తే. గీ. మాయగుణకర్మ కాయంబు లాయజూడ
మాయదెలసిన దనకుదా మాయమాయ
మాయదొలఁగినవేత్తలు మాన్యులైరి॥ రమ్య॥ 103

తే. గీ. బ్రహ్మవేత్తలకీమాయ బ్రహ్మమాయె
కార్మికులకెల్ల పెనుమాయ గ్రమ్మినాయె
బ్రహ్మకర్మలు దెలియక భ్రష్టులైరి॥ రమ్య॥ 104

తే. గీ. మూఢవేత్తల క్రియలెల్ల చోద్యమాయె
మూర్ఖజనులకు నేట్కాల మూఢమాయె
గూఢమెఱిఁగినవారికె గోప్యమాయె॥ రమ్య॥ 105

తే. గీ. తేటగీతంబులను విను ధీవరులకు
తేటగీతంబులివియన్ను తెలియలేని
మోటుమనుజుల కెల్లను మాటలగును॥ రమ్య॥ 106

తే. గీ. శతకమనిచుల్కనాను నెంచకుమనీవు
సాంగముగనీటి జదువగ సారమెల్ల
భావమెఱిఁగి చరించిన బ్రహ్మమగును॥ రమ్య॥ 107

తే. గీ. మేటితిరుమణికోట్ల శ్రీకోటలయార్య
కరుణ కటాక్ష కిరణముఖ్య కవిసూరి
జనులకానంద సుఖమొల్కగను రచించె
రమ్యముగఁ జెప్పెదను విను రాజయోగి. 108

గద్య,

ఇది శ్రీసీతారామచంద్ర ప్రసాదలబ్ధ కవితాధురీణ బాలాకాన్వయ సంజాత
కంఠేశ్వరనాయక లక్ష్మయాఖ్య పౌత్ర లక్ష్మీదేవి రామయార్య
దాస గర్భ పయఃపారావార రాకాసుధాకర సకలసుకవి
సాధుజన విధేయ వీరయాభిధేయ ప్రణీతంబైన
శ్రీ రా జ యో గి శ త క ము
సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీకోటేశ్వరార్పణమస్తు.